# సజీవ సత్యాలు

( త్రిశతి )



రేగులపాటి కిషన్‌రావు

విజయలక్ష్మి పబ్లికేషన్స్
చింతల్‌ఠాణం — 505 405
కరీంనగర్ జిల్లా - ఆంధ్రప్రదేశ్

సజీవ సత్యాలు
విజయలక్ష్మి పబ్లికేషన్స్ ప్రచురణ నెం. 17
ప్రథమ ముద్రణ: జనవరి, 1997
(ఇందులోని కవితలను ప్రచురించిన పత్రికాధిపతులకు కృతజ్ఞతలు)



అర్ధాంగి
విజయలక్ష్మికి

ముద్రణ: విష్ణు ప్రింటింగ్ ప్రెస్, సిరిసిల్ల.    వెల రు. 10-00



నిజమనేది సూర్యునిలా శాశ్వతముగ జీవించును
అసత్యాలు శూన్యములో శూన్యముగా మారుచుండు. 1

ధర్మం ఈ ధరణిలాగ సాగిపోవునది సత్యం
అధర్మమ్ము భాండములా పగిలిపోవునిది నిత్యం. 2

సౌశీల్యము సర్వజనుల మోదమ్మును పొందుచుండు
దుష్టత్వము అంతులేని హానితోను చచ్చుచుండు. 3

హింసనేది ప్రతిహింసను ప్రేరేపణ చేయుచుండు
అహింసయే సంఘానికి శ్రేయస్సును కూర్చుచుండు. 4

సదాచార సంపన్నుడు సత్కీర్తితో వెలుగుచుండు
దురాచార వర్తనుండు ఛీవాట్లే పొందుచుండు. 5

గురి చూచి కొట్టినపుడె లక్ష్యమ్ము ఛేద్యమగును
పథకముతో పనిచేసిన లక్ష్యమ్మది సాధ్యమగును. 6





కొట్టిన ఫలమందించే చెట్టులాగ జీవించిన
7 మట్టిలోన కలసిననూ కీర్తితోను బ్రతకవచ్చు.

దురాత్ములకు సహకారం అందించుట నేరమగును
8 సజ్జనులకు అపకారం చేయుటయే ద్రోహమగును.

ఉన్నంతలో సంపదనూ పంచుచుండు పదిమందికి
9 ఉన్నతముగ యోచించిన ఉండిపోవు నీదుకీర్తి.

వినయము గల మనిషి ఎదుటివాని మనసు సాధించును
10 అవిధేయత చూపువాడు ప్రతి మనిషిని బాధించును.

ప్రతి మనిషిని అనుమానముతో చూచుట తగనట్టిది
11 విజ్ఞతతో ఒక మనిషిని శోధించుట తగినట్టిది.

శ్రద్ధ చూపువాడు విద్యలందు నేర్పు పొందగలడు
12 అశ్రద్ధను చూపువాడు విద్యలెపుడు నేర్వలేడు.

సోమరితనమే మనిషిని పతనానికి చేర్చుచుండు
13 చురుకుదనమె ప్రతి మనిషికి ప్రగతి ఎంతో కూర్చుచుండు.

సర్వజ్ఞుని ఆవేశం మంచి మార్పు తెచ్చుచుండు
14 మూర్ఖుని ఆవేశముతో ఆవేదన పెరుగుచుండు

మంచి మంచి ఆశలనూ మనసులోనె తుంచవద్దు
15 నిరాశలను దురాశలను మనసులోన పెంచవద్దు.



పాండిత్యము గలవానికి విశ్వాసము పెరుగుచుండు
అజ్ఞానము ఏ మనిషికి అంతస్తును పెంచకుండు. 16

మంచి ఆశయాలు కలిగి మంచి పనులు చేయుచుండు
మంచి పనులు చేసి నీవు మంచి పేరు పొందుచుండు. 17

అధర్మముతో ఎవరు ఎపుడు ఆనందం పొందలేరు
ధర్మమునే ఆచరించి ఆనందం పొందుచుండు. 18

ధర్మము ఒక అమూల్యమగు రతనమువలె మెరయుచుండు
అధర్మమ్ము పతనమైన పండులాగ మురుగుచుండు. 19

పనిచేయని వానిఇంట పేదరికము పెరుగుచుండు
శ్రమజీవుల ఇంట సిరులు దినదినమ్ము కురియుచుండు. 20

పేదరికము గలవాడే కన్నీళ్లను కార్చుచుండు.
ఐశ్వర్యము ఉన్నవాడు సుఖములనే మార్చుచుండు. 21

నీతి సత్యధర్మములను ఆచరించి బోధించుము
ఆచరించకుండ ఏది బోధించిన ఫలములేదు. 22

మంచి మంచి అలవాట్లే మనిషి విలువ పెంచుచుండు
దురలవాట్లు కలిగియున్న మనిషి విలువ తరుగుచుండు. 23

భౌతిక సంపదలు మనిషి అవసరాలు తీర్చుచుండు
భోగమ్ముల వలన మనిషి కష్టాలను ఓర్చకుండు. 24



అనుమానము మనసునెపుడు కోసిబాధపెట్టుచుండు
25 మతితప్పినవాడు ఎపుడు అరచిగోల పెట్టుచుండు.

మతితప్పినవాని మాట లక్ష్యపెట్టువారెవ్వరు?
26 గురి తప్పని మంచిమాట వినని మనిషివాడెవ్వడు?

నీరుపంచు నల్లమబ్బు నిన్నేమని యాచించును?
27 యాచించి బ్రతుకువాడు పరులకేమి అందించును?

లయ్యను మోహించువాడు భార్యచెంత చేరేనా?
28 మధుపానము వేయువాడు మకరందము కోరేనా?

కాలుజారి తిరుగు స్త్రీని మోహించే సరసుడెవరు?
29 దిగజారిన మనిషిచెంత చేరు మంచి మనిషి యెవడు?

గుండెబలము లేనివాడు వీరుడెపుడు కాజాలడు
30 నిశితబుద్ధి లేనివాడు విద్యలేవి పొందలేడు.

పరులనాశ్రయించువాడు పరపతినీ పొందేనా?
31 పనులు చేయలేనివాడు ప్రగతి తాను పొందేనా?

బుసకొట్టే విషనాగులు స్వంత మేడ కట్టేనా?
32 కష్టపడే చిరుచీమలు పరులకొంప చేరేనా?

అరచి అలసిపోవు కాకి ఆనందం పంచేనా?
33 కాకులతో తరుమబడే కోకిల లయ తప్పేనా?



మనిషి మనిషి కలసినపుడు పరిచయాలు పెరుగుచుండు
మనసు మనసు కలసినపుడు చెలిమివృద్ధి పొందుచుండు. 34

తాతగారి ఘనకీర్తిని కీర్తించిన ఫలమేమిటి?
పరులు పొగడు పనులు చేసి నీవు కూడ కీర్తిపొందు. 35

గొప్పతనము చెప్పుకొనుట గొప్పకాదు ఎవరికైన
గొప్పపనులు చేసి చూపి గొప్పతనము పొందవలయు. 36

పొందుచేయ నెంచినపుడె మంచిచెడులు తరచిచూడు
పొందబోకు పరాభవం చెడువారితొ పొందుజేసి. 37

గుణవంతుల మాటలను వినవలయును అనిపించును
దురుసు దురుసు మాటలను వినుటకెవడు సిద్ధపడును. 38

సుర సరిత్తులో సహితము సుధ ఎప్పుడు ప్రవహింపదు
సుధను పొందవలయునన్న తగినంతగ శ్రమియించుము. 39

బంధించీ బాధించిన మనిషి మంచివాడగునా?
మంచిని బోధించి మనిషి మంచితనము పెంచవలయు. 40

పెంచవలయు పసివాడిని మంచినెంచి నేడే
త్రుంచవలయు అవగుణాలు చిన్నతనమునాడే. 41

నేటి నుండి రేపటికి సాగిపోవు ఈ మనిషికి
మమత సమత భావమ్ములు నేర్పవలయు నేర్పవలయు. 42

కదలు కదలు మంటేనే కదిలేనా ఘన ఘనమ్ము
43 శక్తియుక్తి ప్రయోగించి కదలించిన కదలును కద!

పరమాత్ముడు నా ఎదలో ప్రేమ పూలు పూయించిన
44 పూజించెద పరమాత్ముని ఆ ప్రేమ పూలతోనే.

నా ఎదలో అనురాగపు సుధలు అతడు కురిపించిన
45 నిండు మనసుతో అతనిని ప్రేమించెద అర్చించెద.

మనసు పొరలలో దాగిన మాలిన్యము తొలగిపోతె
46 మమత సమత ఆరాధన భావములే వచ్చిచేరు.

నిత్యము నైవేద్యములిడి సాగిమొక్కుటెందులకు?
47 సాటి మనిషి కంటినీరు తుడిచివేయ సుమకట్టుము.

సురకత్తులతో నరికిన కఠినశిలలు తెగజాలును
48 కఠినాత్ముని కాఠిన్యము కత్తితోను తెగజాలదు.

చీకటినీ తిట్టినచో చిత్తగించి పోతుందా?
49 వెలుగు తనను తాకగానె తొలగితాను పోతుందీ.

విద్యాబుద్ధులు ఉంటే ఒద్దికగా నీవుంటే
50 భూలోకం నాకంలా నీకు మారకుంటుందా?

విజ్ఞానమె సంపదయని భావించి సాధించిన
51 చివరిదాక ఈ సంపద నీకుతోడు ఉండును కద!

రంపముతో కోసిననూ చీకటి తెగిపోతుందా?
అజ్ఞానపు పనుల వలన చీకాకే పెరుగుతుంది. 52

నెయ్యానికి వియ్యానికి మనసు మనసు కలువాలి
కయ్యానికి కల్మషమగు మనసు ఒక్కటే చాలును. 53

చీకటిలో వజ్రమైతే వెలుగకుండ ఉంటుందా?
పరీక్షలే ఎదురైనా ప్రతిభ ఆగిపోతుందా? 54

కనిపించే ఈ మనిషికి వృద్ధాప్యము తప్పేనా?
కనిపించని ఆ మనసుకు వృద్ధాప్యము వచ్చేనా? 55

ఎత్తుకు ఎగిరిన గద్దలు అంతస్తును పొందేనా?
నేలను వీడని ఎద్దుల అంతస్తులు తరిగేనా? 56

నియమం పాటించకుంటె మనిషి మనిషి అవుతాడా?
నీతి నియతి పాటించిన మనిషి దేవుడవుతాడే. 57

కండబలము కలదనుచూ గర్వపడుట సబబుకాదు
ఔదార్యము కలిగిఉంటె అందరు దరిచేరుతారు. 58

కలిమిచూచి చెలిమిచేయువాడు హితుడు కానేరడు
గుణము చూచి చెలిమిచేయువాడే నిజమైన హితుడు. 59

మేని సొగసు చూచి ఎపుడు మనిషి స్థాయినెంచవద్దు
మనసు గొప్పతనము చూచి మనిషి గొప్పనెంచవలయు. 60

ఎరవేసి చేపపట్టు విధము తెలిసినట్టివాడు
61 సమయము కనిపెట్టి గట్టి ఉచ్చులు బిగగట్టగలడు.

కపటబుద్ధి కలవాడూ హితము చేయజాలడెపుడు
62 నిర్మలమగు మనసు కలిగి ఉన్నవాడె హితముచేయు.

జారిపడే బండపైన కాలు నిలుప తగదెప్పుడు
63 మనసు స్థిరము లేనివాని మాట ఎపుడు నమ్మవద్దు.

దుష్టబుద్ధి కలవానితొ చెలిమిచేయ తగదెప్పుడు
64 పెద్దబుద్ధి కలవారితొ కలహమాడ తగదు తగదు.

మేలు చేయువానికెపుడు కీడుచేయ తలచ తగదు
65 కీడుచేయు వానిచెంత క్షణకాలము నిలువతగదు.

ఔచిత్యము పాటించక పనులు ఎపుడు చేయవద్దు
66 విజ్ఞులెపుడు ఔచిత్యము మరచి పనులు చేయలేరు.

శక్తిని సంపూర్ణముగా నియోగించి పనిచేసిన
67 పెద్ద కొండనైననేమి పిండికొట్టి చూపవచ్చు.

ఖడ్గధారులై వెళ్లిన యుద్ధవీరులేమయ్యిరి?
68 రణపిపాస కలిగివారు ఇహలోకము వదలలేద?

నేతి బీరకాయలోన నెయ్యి ఎంత ఉంటుందో
69 కపటబుద్ధి కలవానిలొ కరుణ అంత ఉంటుంది.

ప్రణాళికలు వేసి పనులు చేయకున్న ప్రగతియేది?
నడిచెదనని కూర్చుంటే గమ్యమదే వస్తుందా? 70

ప్రణాళికలు వేయగానె కర్తవ్యము పూర్తికాదు
ప్రజలలోన చైతన్యము పెంచి పనులు సాధించుము. 71

నేలనాది నీరునాది గగనతలము నాదందువు
ఎచటి నుండి తెచ్చినావు ఎచటికి గొనిపోదువీవు? 72

రత్నఖచిత కిరీటములు మస్తకమున ధరియించిన
రారాజులు యెందరు మన కథలలోన నిలిచినారు? 73

తెలివి కలదు కలదనుచూ గర్వపడే మానవుడా!
నింగిలోన నిలిచియున్న చుక్కలెన్నొ చెప్పెదవా? 74

ధనగర్వము బలగర్వము మనిషికెపుడు పనికిరాదు
ధనము, బలము తగ్గినపుడు మనిషికున్న బలమేమిటి? 75

నీతి సత్యధర్మమ్ములు నిన్నెప్పుడు రక్షించును
అవినీతి పనులు నిన్ను శిక్షించును శిక్షించును. 76

కలిమి కలిగి ఉన్నానని మిడిసిపడకు మిడిసిపడకు
లేమి నిన్ను ఆశ్రయించి మట్టిపాలు చేయజాలు. 77

ఖడ్గధారులెందరైన సత్యమ్మును చంపలేరు
అధర్మముతో జీవితమున స్వర్గమ్మును దింపలేరు. 78

అంతులేని అసత్యాలు సత్యముతో సరితూగవు
79 ఎంతచెత్త జమచేసిన బంగారము కానేరదు.

పనికిరాని ఆశలను పదిమందికి పంచవద్దు
80 నమ్మినవారలను ఎపుడు నట్టేట ముంచవద్దు.

శక్తికి మించిన గొప్పలు చెప్పవద్దు చెప్పవద్దు
81 శక్తిననుసరించి పనులు చేయుటయే ముద్దు ముద్దు.

చెరకు గడలు పిండి పిండి రసము తీసి త్రాగినటుల
82 పుస్తకాలు చదివి చదివి సారమెరుగవలయు మనము.

రసములేని చెరకుపిప్పి నెవడు చప్పరించవచ్చు
83 విద్యలేవి లేనివాణ్ణి ఎవడు ఆశ్రయించు, మెచ్చు.

గణనచేయ తరముకాదు విద్యలెన్నొ కళలెన్నో
84 తరతరాల ఆ విద్యలు సాధించినదే సంస్కృతి.

కల్లనెరుగనివాడు ఎల్లలెరుగనివాడు ఎవడూ?
85 ఎవడు ఎవడు ఎవడాతడు అతడేకద మనదేవుడు.

పరిశీలన దేనికొరకు, పరిశోధన దేనికొరకు?
86 సదా మనకు పనికివచ్చు సత్యము రాబట్టుటకే.

నేలమీద కోట్ల జనులు పుట్టిగిట్టి వెళ్లినారు
87 పుట్టినట్టి కోట్ల జనులు నేలకేమి ఇచ్చినారు?



ఆనందమునందించని కాకి అరపు వినునెవ్వడు?
పికము పాట ఒకటివాలు పరవశించి విందుము కద! 88

కరుణ కలిగియున్న మనిషి కరుణ పొందగలుగుతాడు
కఠినాత్ముడు కరుణనెపుడు పంచలేడు పొందలేడు. 89

పంకజమును పొందుటకై పంకములో దిగవలదా?
కాలు బురద అయిననేమి కమలము చేజిక్కునుగా! 90

ధీమంతులు తమ బుద్ధినె సంపదగా భావింతురు
సంపదలూ తరిగిననూ ధీనిధి అది తరగదుగా! 91

ఆరోగ్యమె కోరదగిన సంపదకద ఎవరికైన
ఏ సంపద రోగికెపుడు ఆనందము పంచగలదు. 92

ఏదో ఒక దివ్యశక్తి నీ మనసున నిలిచి ఉంటె
మంచి పనులు చేయగలవు మంచి పేరు పొందగలవు. 93

దుష్టశక్తి నీ మనస్సు పొరలలోన దాగిఉంటె
ఎవరికి నచ్చని పనులను నీవు చేసి బావగలవు. 94

కలహాలకు కారణాలు వేలకొలది ఉన్ననేమి
చెలిమిచేయు మనసు ఉంటె చేయి చేయి కలుపవచ్చు. 95

సోమరిగా జీవించుట ఎపుడుగాని తగనట్టిది
కృషిచేయుచు అభ్యున్నతి సాధించుట తగినట్టిది. 96





పాఠశాల చేరుటయే పరమావధి కాదు కాదు
97 చిత్తముతో పాఠాలను నేర్చుకొనుట పరమావధి.

ఏ మనుజుని రక్తమైన ఎరుపురంగు ఉండును కద!
98 ఆ మనుజుల మనసులలో విభేదాలు ఎలా కలుగు?

చిత్తశుద్ధి లేనివాడె గుళ్లచుట్టు తిరుగుతాడు
99 చిత్తములో దేవుడుంటే గుడి చెంతకు చేరనేల?

యాచించకు యాచించకు ఎవరినేమి యాచించకు
100 మంచి మనసుతోను చెలిమి చేయుమనుచు యాచించుము.

మనిషి మాట తప్పినను గ్రహాలు గతులు తప్పకుండు
101 మనిషి తప్పు చేసినపుడు శిక్ష తానె పొందుచుండు.

విజయము సాధించినపుడు ఎవరు విర్రవీగవద్దు
102 పరాజితుల చూచి ఎపుడు పరిహాసము చేయవద్దు.

సుందరమగు మోము చూచి మోహించకు మోసపోకు
103 మేడిపండు చందముగా కొందరిలో గుణముండును.

వినయము విజ్ఞానములే మనిషి విలువ పెంచుచుండు
104 గర్వాంధుడు మనిషి విలువ గ్రహించకుండు పెంచకుండు.

సతత హరిత వృక్షమువలె సత్యము శోభిల్లుచుండు
105 అసత్యాలు రాలిపడిన ఆకులవలె కుళ్లుచుండు.



సరళమైన భాష ప్రజల నాల్కలపై బ్రతుకుచుండు
కఠినమైన భాష ప్రముఖ పండితులను ఆశ్రయించు. 106

ఒక్కరోజు అయిన చాలు పరిమళించు పువ్వులాగ
చిరకాలం ముల్లులాగ బ్రతికిన ఫలమేమున్నది. 107

జ్ఞానార్జన కొరకు మనము నిత్యము శ్రమ చేయవలయు
ఆగిపోతె మృత్యువు అన్నారు కదా! మన పెద్దలు. 108

సాధించినదానితోనె సంతృప్తి చెందవద్దు
చేసినపని చెడిపోతే పనిచేయుట మానవద్దు. 109

ధనగర్వము బలగర్వము ప్రకటించిన రారాజులు
ప్రజల మెప్పు పొందలేదు కీర్తివారు పొందలేదు. 110

కీర్తికొరకు తపనపడిన కీర్తి పొందగలిగేరా?
సహజశక్తిగల మనిషికి కీర్తి రాక మానేనా? 111

పొట్ట కూటికొరకు మనిషి విద్యలెన్నో నేర్చినాడు
కోరికలను అదుపుచేయు ఏ విద్యను నేర్చినాడు? 112

విద్య వివిధ ప్రాంతాలలో మన్ననలే పొందుచుండు
అజ్ఞానము ఎచ్చోటను గౌరవమ్ము పొందలేదు. 113

ప్రత్యేకత గల మనిషిని ఆశ్రయించి మన్నింతురు
ప్రత్యేకతలేని మనిషి ప్రత్యేకత ఏమున్నది? 114



ఏమున్నది ఏమున్నది జీవితమున ఏమున్నది?
115 పెరిగి పెరిగి విరిగిపోవు అనుభవాలు రెండున్నవి.

కళ్లు రెండు మూసుకుంటె కనిపించదు ఏ సత్యం
116 కనిపించని కళ్లుండుట దుర్భరమగు ఒక సత్యం.

కనిపించినదే సత్యం కాదు కాదు లేవయ్యా
117 వివేకముతో యోచించిన నిజము తెలుసులేవయ్యా.

జనగణముల ఎడదలలో నిలుచువాడె నాయకుండు
118 జనమును దోచెడివాడూ కాదు నిజము నాయకుండు.

సృజనశక్తి లేని కవులు నవతనేమి సాధింతురు?
119 సృజనశక్తి గలవారే పదపదమును శాసింతురు.

ధీమంతుడు చేయు బాస ప్రయోగాలు చెల్లుచుండు
120 సృజనశక్తి లేకుంటే పదములేవి చెల్లకుండు.

ఆశ మంచిదే కాని అత్యాశ పనికిరాదెప్పుడు
121 స్వల్పమైననేమి స్వంత ఆర్జనమ్మె మేలు మేలు.

కోపించుట శోకించుట బలహీనుల లక్షణమది
122 క్రోధశోక ద్వయమును జయించువాడె ప్రాజ్ఞుడు కద!

నీ గుణమే నీకు రక్ష సద్గుణములు కలిగియుండు
123 కలిమిలోన లేమిలోన అవియె నిన్ను కాచుచుండు.



బుద్ధి బలములేని మనిషి అణచివేయబడుచునుండు
గడ్డె బలము గల మనుజుడు అధికారము చేయుచుండు. 124

అధికారము మమకారము కలకాలం కలసి ఉంటె
పాలితులకు బాధ ఎపుడు కలుగబోదు కలుగబోదు. 125

అధికారము పొందుటకై పన్నాగము పన్న వద్దు
అణచివేత చర్యలకై అధికారము వాడవద్దు. 126

అధికారము ఒక మనిషిలొ అహంభావమును పెంచును
మమకారము సహకారము మంచి పనులు చేయించును. 127

కాకూడదు అనుకున్నది కాకుండా ఆగిపోదు
రాకూడదు అనుకున్నది రాకుండా ఉండిపోదు. 128

అనుకున్నది కాకపోతె అది మనిషికి శాపం
అనుకోనిది జరిగిపోతె అది మనసుకు తాపం. 129

సంపదలూ ఉప్పెనలా మనచెంతకు వచ్చిపడవు
అదమరచి మనముంటే ఆపదలే మీద పడును. 130

ఆదర్శం చెప్పువాడు ఆదర్శం పాటించిన
అతని కథే ముందు ముందు ఆదర్శం కాగలుగును. 131

మాటలలో ఆదర్శం చూపించిన చాలదోయి
చేతలలో ఆదర్శం చూపించిన చాలునోయి. 132



నిండుచందమామ ఎంత అందముగా నున్ననేమి?
133 అమావాస్యనాడు అతని అందమేది చందమేది?

తండ్రితాతల గొప్పతనము చెప్పి గొప్పను పొందజూడకు
134 స్వంతబుద్ధితో గొప్పపనులు చేసి గొప్పను పొందజూడుము.

వక్రబుద్ధులు పెద్దగద్దెలు చేరి రాజ్యము చేసినప్పుడు
135 నరళమతులకు స్థానముండదు దీనులకు మరి దిక్కు ఉండదు.

ఎంత శక్తితో గాలివచ్చిన కొండ తన తలవంచునా?
136 పెద్ద ఆపద వచ్చి చేరిన పెద్దమనసు చలించునా?

అంతస్తులకెగదోసే నిచ్చెన బ్రతుకెంతగొప్ప?
137 నీటిని పైకందించే బొక్కెన బ్రతుకంత గొప్ప.

గోలచేసినా కాకులు కలసిమెలసి ఉంటాయి
138 దొరికిన ఆహారమంత పంచుకొంటు తింటాయి.

నిజమనేది సూర్యునిలా నిత్యము వర్దిల్లుతుంది
139 మరుగున పడిపోయిననూ తిరిగివచ్చి వెలుగుతుంది.

రవిచంద్రులు ఆకసాన కలకాలం కన్పింతురు
140 మహనీయులు చరిత్రలో చిరకాలం జీవింతురు.

అర్హతలకు మించినట్టి అధికారము నాశించకు
141 పనులు సరిగ చేయలేక చతికిలబడి కూర్చుండకు.



అధికారము కొరకు ఒకడు ధనము కొంత విసురుతాడు
అధికారము చిక్కగానె ధనరాసుల్ గుంజుతాడు. 142

నీటిలోన పడ్డనిప్పు రూపుమారి తీరుతుంది
అవినీతిలో పడ్డనిజం నిజరూపమె మారుతుంది. 143

అవినీతిని ఆశ్రయించి బ్రతుకువాడు మనిషేనా?
బురదగుంట నాశ్రయించి పురుగులెన్ని మనుటలేదు. 144

మంచికొరకు పోరాడుచు మరణించుట మేలు మేలు
చైతన్యం లేక బ్రతుకు సాగించుట వాలు వాలు. 145

దుర్మార్గమె అధికారము చెలాయించగలిగినపుడు
సన్మార్గము బాధపడుచు కనుమరుగైపోవును కద! 146

వెలుగుపంచు ఆసూర్యుడు ఎవరి ఆజ్ఞ పాటించును
సహజశక్తిగలవారిని శాసించే వారెవ్వరు? 147

ప్రాజ్ఞులు తమ సహజశక్తి పనులలోన చూపింతురు
శక్తికి తగినంత ఫలము రావాలని ఆశింతురు. 148

సహజశక్తి గల ప్రాజ్ఞులు పరులనెపుడు శాసింతురు
శక్తియుక్తిలేనివారు అణగిమణగి పడిఉందురు. 149

ఈగలు పెట్టిన తేనెను దాచి దాచి తాగుతారు
ఆ ఈగలె చేరవస్తె తరిమి తరిమి కొట్టుతారు. 150

దేవుడు కనరాడేమిటి రాడేమిటి రాడేమిటి?
151 ఉన్నాడన్న ఆదేవుడు ఎచట దాగి ఉన్నాడట?

నిత్యము నైవేద్యములిడి మొక్కుతావు మొక్కుతావు
152 మెక్కుటకే మొక్కుతావు మెక్కిమెక్కి మొక్కుతావు.

సాగిపారుచుండు యేరు ఏమి తెలియజేయు మనకు
153 మనసు ఉంచి మంచి పంచి మనుగడ సాగించుమనును.

తృప్తిలేని ఏ మనుజుడు సుఖములేవి పొందలేడు
154 తృప్తిలోనె సుఖమున్నది తృప్తిపడుము తృప్తిపడుము.

హితముకోరు వాని హితము కోరుటలో గొప్పలేదు
155 గొప్పకొరకు కాదు గాని సర్వజనుల హితముకోరు.

పరులను పీడించువాడు పాపాత్ముడు పాపాత్ముడు
156 దీనుల కాపాడువాడు పరమాత్ముడు పరమాత్ముడు.

ప్రణాళికలు చేపట్టుట అది మాత్రమే గొప్పకాదు
157 చేపట్టిన పనులన్నియు సాధించుట గొప్పతనము.

సేవలు చేసెదనంటూ అధికారము పొందువాడు
158 సేవాగుణముంటె తప్ప సేవలేమి చేయలేడు.

సేవచేయు గుణముంటె అధికారమె కావాలా?
159 సేవచేయు పరిధి ఎంత విశాలమో తెలుపాలా?

ఆపదలో ఆదుకునేవాడే నిజమైన సఖుడు
సంపదలో చేరువాడు నిజము సఖుడు కానేరడు. 160

గానుగెద్దులా తిరిగిన గమ్యమెపుడు చేరగలరు?
దీక్షలేనివారు కొత్త విద్యలేల నేర్వగలరు? 161

గగనతలం ఎంత ఉన్న ఇలాతలం మనకు మిన్న
మిన్నుకన్న మన్నుమిన్న ప్రాణకోటి అచట ఉన్న. 162

ప్రాణకోటిలోన మనిషి గొప్పవాడు ఎందువలన?
ఆలోచన చేసి అతడు నవ్యత సృష్టించు కనుక. 163

ప్రాణశక్తి కలిగియున్న భూగోళమె మనకు మిన్న
మనిషిలేని ఏగోళము మనకు గొప్పకానేరదు. 164

మనిషి గొప్పతనమేమిటి? మమత కలిగియుండడమే
మమత గొప్పతనమేమిటి? సమతను సాధించునదియె. 165

దాహమదే తీరుతుంది మంచినీరు త్రాగినపుడు
అంతులేని ధనదాహం మనిషికెపుడు తీరుతుంది? 166

తీరికలేకుండ మనిషి పనులెన్నో చేయగలడు
అంతులేక పెరుగునట్టి కోరికలను తీర్చలేడు. 167

మృగముల వేటాడుటకై సురకత్తులు పట్టగలరు
మనిషి చెడ్డమనసునెపుడు ఏ కత్తితొ కొట్టగలరు? 168



పలుకు పలుకులో సత్యం పలుకనేర్చినట్టివాడు
169 ఆపదలో కూడ ఎపుడు అసత్యాలు పలుకలేడు.

నేరమ్ములు చేయువాడు నిజము చెప్పజాలకుండు
170 నీతిని పాటించువాడు పాపభీతి హొందకుండు.

మంచితనము పంచువాడు మన్ననలను హొందుతాడు
171 వంచనతో బ్రతుకువాడు తన్నులతో క్రుంగుతాడు.

సుగుణమ్ములు గలవానితొ కలసిమెలసి తిర్గినపుడు
172 మల్లెపూల పాన్పుమీద మేను వాల్చినట్లుండును.

కుటిలాత్మునితో మాటలు కలుపవలసి వచ్చినపుడు
173 ముళ్లకంప మీద కాలు పెట్టినటుల అనిపించును.

మెత్తనైన పువ్వువెనుక గుచ్చునట్టి ముళ్లుండును
174 కపటపు చిరునవ్వు వెనుక చిచ్చుపెట్టు గుణముండును.

నీడనిచ్చు చెట్టుచెంత సేదతీర వెళ్లితారు
175 కొమ్మ రెమ్మ లేని మొద్దు చెంతనెవడు చేరుతాడు.

తాకినంతనె మాడ్చివేసే నిప్పునెవ్వడు తాకనెంచును
176 పట్టబోతే కొట్టబోయే కొమ్మనెవ్వడు పట్టబోవును.

నిప్పులాంటి నీ ప్రవర్తన నీకు రక్షగ నిలుస్తుంది
177 నియతి కలిగి పనులు చేసిన విజయమే నిను వరిస్తుంది.



ముళ్లబాటలో తిరుగువానికి పాదరక్షలు ఇచ్చురక్షణ
కుళ్ళిపోయిన సమాజములో శక్తియుక్తులె ఇచ్చు రక్షణ. 178

మధుపానము చేయువాడు పరపడతుల కోరువాడు
అర్ధాంగికి అతడు ఎపుడు అన్యాయమె చేయుచుండు. 179

నీ బుద్దిని వక్రమార్గమందు నడువ బోనీయకు
దుష్టబుద్ధి కలవారిని వెంతచేర రానీయకు. 180

పచ్చదనము మెచ్చదగును పంటనిచ్చు హాయిపంచు
పిచ్చితనము మెచ్చరెవరు కలతనిచ్చు బాధపంచు. 181

ఆరోగ్యమె గొప్పనైన భాగ్యముగా తలచవచ్చు
ఆరోగ్యము కలిగియున్న సుఖములెన్నొ పొందవచ్చు. 182

మట్టిలోపల మహిమ ఏదో దాగి ఉందని చెప్పవచ్చును
కుళ్లు తనలో చేర్చుకొంటూ మంచి పంటలు పెంచి ఇచ్చును. 183

గర్వముగల మనుజుడెపుడు గౌరవాన్ని పొందలేడు
మూర్ఖుడు ఏనాడు కూడ బుధుల గౌరవించలేడు. 184

మందమతులు చతురోక్తుల అందాలను తెలుసుకోరు
మెత్తని మనసున్నవారు కఠినోక్తులు పలుకలేరు. 185

కల్లలెపుడు పలుకువాడు నిజమునెపుడు చంపుచుండు
నిజము పలుకు పలుకువాడు నిజమునెపుడు పెంచుచుండు. 186



పేదరికము ఎవరికైన బాధలనే పంచుచుండు
187 ఐశ్వర్యము ప్రతిమనిషికి సుఖములనే పెంచుచుండు.

పెద్దబుద్ధి ఉన్నవాడు పరులనెపుడు గౌరవించు
188 అల్పుడెపుడు పరవారిని కించపరచ యత్నించును.

అభ్యున్నతి కొరకు మనిషి అనుక్షణం కృషిచేసిన
189 లక్ష్యాలను సాధించును లక్షణముగ జీవించును.

పుట్టిపెరిగి చచ్చువాడు పుట్టునెందుకో తెలియదు
190 మరణించిన పిదప మనసు ఎచటకేగునో తెలియదు.

ఏవో ఒక కోరికతో మనిషి బ్రతుకు గడుపుచుండు
191 ఏ కోరికలేనివాడు ఎలా బ్రతుకగలుగుచుండు?

ఒక్క నిప్పురవ్వచాలు కొంపలెన్నొ కూల్చుటకు
192 ఒక్కమంచి మాటచాలు కోపము చల్లార్చుటకు.

సంతోషమె మనిషికెంతొ బలమును చేకూర్చుచుండు
193 దిగులు కలిగిఉన్న మనిషి చేసిన పని చెడుచునుండు.

పనులు చేసి బ్రతుకువాడు శ్రమజీవిగ పేరుపొందు
194 సోమరిలా తిరుగువాడు ఏ కీర్తిని పొందుచుండు?

ఆకలినీ చంపకుంటె ఆకలి నినుచంపుతుంది
195 అమితముగా ఆరగిస్తె అన్నమె నిను చంపుతుంది.



చక్కని ఆలోచనగల మనిషి నిజముగా దేవుడు
చిక్కులలో ఇరికించే మనిషి మనిషి కాజాలడు. 196

కరిగిపోవు కొవ్వొత్తిలా కరుణ మనకు కనిపించును
కరగని మనసున్నవాడు కఠినశిలయె అనిపించును. 197

మల్లియవలె పరిమళములు పంచు మనసు గలవారికి
పరులెవ్వరు? అతనిపట్ల పగబూనే వారెవ్వరు? 198

తలపెట్టిన పనిని నీవు అదే పనిగ సాగిస్తే
తలయెత్తుచు కనిపించును ప్రగతి నీదు కనుల ముందు. 199

తెలివి ఉన్న మిడిసిపడకు అదియె నీకు హానిచేయు
తెలివిపంచు మమతపంచు అవియె నీకు మేలుచేయు 200

కోరుకున్న మంచి మంచి కోరికలే తీరవలయు
ఆరని మడిలాగ బ్రతుకు పచ్చగాను ఉండవలయు. 201

ఎదగదిలో దాగియున్న భావాలను బయటపెట్టు
ఎదఎదకు ఆనందము సదా నీవు పంచిపెట్టు. 202

అత్యాశయె మనిషి మంచితనము త్రుంచు దుష్టశక్తి
మంచి ఆశయమ్ము మనిషి గొప్పతనము పెంచు శక్తి. 203

పూలు పూసిన చెట్టు అందముగ కనిపించు
కాయకాసిన చెట్టు ఆకలిని మరిపించు తల్లివలె కనిపించు. 204



రచయిత తన భావాలను రమ్యముగా ప్రకటించును
205 గాన కళావిశారదుడు హృద్యముగా వినిపించును.

సృజనశక్తి గలవాడు రాసినదే కావ్యమగును
206 గానశక్తి గలవాడు పాడినదే పాటయగును.

దురాశలను నిరాశలను మనసులోనె త్రుంచుకో
207 మంచి ఆశయాలపైన ఆశనీవు పెంచుకో.

వినయముగల వ్యక్తిశక్తి అందముగా దాగియుండు
208 అదనుచూచి అదేశక్తి పైకి ఉబికి వచ్చుచుండు.

అందమైన భావాలను కవితలుగా మలచినపుడు
209 ఎందరి హృదయాలనో అవి దోచుకొనును నిశ్చయమ్ము.

అందమైన మోముకాదు అందమైన మనసు చూడు
210 అందమైన నాగుపాము కాటువేసి చంపచూచు.

జూదమాడి ఓడిపోయి అవమానము పొందబోకు
211 జూదము ఏనాడు కూడ అంతస్తును పెంచబోదు.

శక్తి కలిగియున్న మనిషి కీర్తి పొందగలుగుచుండు
212 శక్తియుక్తి లేని నరుడు అణచివేయబడుచునుండు.

రవికిరణం సోకగానె కమలం వికసించునేల?
213 చీకటి కనిపించగానె రేకులు ముకుళించునేల?



చెలిమి కలిమి బలమైనది పెంచుకొనుము దినము దినము
తుంచుకొనుము శత్రుత్వము ఆ భావమె తగదు తగదు. 214

చీమలాగ పనిచేసిన చీకుచింత ఏమి ఉండు?
సోమరిలా పడిఉండిన కలిమి ఎలా కలుగుచుండు? 215

నిజము నిండి ఉన్నమాట నిరంతరం బ్రతుకవలయు
అబద్ధాలు పుట్టగానె అంతమొంది తీరవలయు. 216

అధర్మము పరాజయము పొందినపుడె ప్రయోజనము
ధర్మము ఒక శక్తిలాగ మారినపుడె ప్రయోజనము. 217

కనుగొననిది కనుగొనుటకు ప్రయోగాలు చేయుచుండు
కొత్తదనము కనిపెట్టిన కీర్తి వచ్చి చేరుచుండు. 218

మితమును పాటించినపుడు మిగులుతుంది ప్రమోదం
మితమును పాటించనపుడు కలుగుతుంది ప్రమాదం. 219

సంతానం లేనివారు పొందుతారు సంతాపం
అధికసంతు గలవారలు పొందలేరు ఆనందం. 220

కలకాలం బ్రతుకునట్టి దేవగణము ఎచటకలదు?
పరుల హితను కోరునరులె దేవగణము నిజము నిజము. 221

చెడుగు పనులు చేయునట్టి రాక్షస గణమెచటకలదు?
చెడుగు పనులు చేయునట్టి మనుజుడెకద రాక్షసుండు. 222



జూదమాడుట వలన మనిషికి హాని కలుగును హానికలుగును
223 ఆటలాడుట వలన మనిషికి మేలు కలుగును మేలుకలుగును.

చిత్తశుద్ధి కలిగి మనుజులు పనులు చేసిన ప్రగతి కలుగును
224 బుద్ధిలేని పనులు చేసిన పతనమేకద! మనిషి పొందును.

వంగి కష్టము చేయువానికి కలుగుచుండును సంపదల్
225 దొంగతనమది చేయువానికి వచ్చుచుండును అపదల్.

కలలుగనుట తప్పుకాదు కల్లలాడుట తప్పులే
226 స్వంతలాభము తప్పుకాదు కొల్లగొట్టుట తప్పులే.

నిలువనీరు హానిచేయు పారునీరు మేలుచేయు
227 నిలువనీరులాగ నీవు పడిఉండకు పదముందుకు.

నిండు మనసు కలిగిఉండు మనిషి మనసు తొణకకుండు
228 నిండు మనసు లేనివాడు నిండుగ మాటాడకుండు.

అనాధలను చూచి జాలిపడిన ఫలితమేముండును?
229 శక్తికొలది సహకారము చేసి ఆదుకొనుచుండుము.

పరులక్షేమం కోరువాడే సంతసముతో తాను బ్రతుకును
230 పొరుగువానికి హానిచేసెడు దుష్టబుద్ధికి హానికలుగును.

నింగినెత్తిన రాలిపడిన జడవకుండును ధీరుడు
231 చిన్న అలికిడి వినినకూడ జడియుచుండును భీరువు.



సృష్టిలోన ఏ ప్రాణియు చిరంజీవి కాజాలదు
కీర్తిచేతనే మనుజుడు చిరంజీవి కాగలుగును. 232

ప్రతిభ కలిగియున్నవాడు ప్రగతి తాను పొందుచుండు.
ప్రతిభలేని మనిషి ఎపుడు బాధతోడ క్రుంగుచుండు. 233

సత్యము ఆ సంద్రములా విస్తరించి ఉండవలయు
అసత్యమ్ము జలములేని కూపములా ఉండవలయు. 234

ధనము కలిగియున్నవాడు ధనమును సాధించవచ్చు
విద్యాధనమున్నవాడు జనుల మెప్పు పొందవచ్చు. 235

అంతులేని ఆకసములా మనసు కలిగి ఉన్న మనిషిని
ఆదరించనివారు ఎవరు? మనసు పంచనివారు ఎవరు? 236

వాగులాగ సాగిపోతె వంకలెన్నో చూడవచ్చును
బావిలాగె నిలిచిపోతె లోతు ఎంతో తెలియవచ్చును. 237

పనికిమాలిన చర్చలన్నియు మానుకొమ్మని చెప్పుచుందురు
శాస్త్ర చర్చలు చేసి చేసి శాస్త్ర విద్యలు పెంచుమందురు. 238

కఠిన శిలలను మనోహరముగ మలచువాడె కళాకారుడు
కఠినచిత్తుని మనసు మెత్తగ మార్చువాడే మాట నేర్పరి. 239

మనుజులందున రెండెకులములు మంచివారలు చెడ్డవారలు
అంటరానీ మనుజులెవ్వరు? చెడ్డవారే చెడ్డవారే. 240



మరణమన్న భావమ్మది భయపెట్టును ప్రతి మనిషిని
241 మరణము తప్పించుకొనెడు మనిషి యెవడు ఇలలోపల.

దూరముగా నున్న కొండ నునుపుగానె కనిపించును
242 చెంతచేరి తెలుసుకొనిన నిజము ఇదా అనిపించును.

మతమేదైనను యేమిటి మంచి మనసు నీకు ఉన్న
243 మతముకన్న మమత మిన్న మతభేదము విడువుమన్న.

కోకిలవలె పాడువాడు కోటిజనుల మెప్పుపొందు
244 కాకిగోల చేయువాడు కసరికొట్టబడుచునుండు.

నేడు చేసే రేపు చేసే పనులు చక్కగ చేయుకొరకు
245 గత చరిత్రను మనం మననం చేసుకోవలె రాసుకోవలె.

కోరికలు మన మనమునందున వేలు పుట్టును ఏలపుట్టును
246 తీరుకోరిక పుట్టవచ్చును తగని కోరిక పుట్టునెందుకు?

వాన చినుకులు కురిసినప్పుడు నేల పచ్చగ పెరుగుచుండును
247 కంటి చినుకులు రాలినప్పుడు ఓదార్పు మనసులు పెరుగునా?

నీటి చుక్కలు స్వీకరించి నేల మొక్కలు పెంచి ఇచ్చును
248 మొక్కలన్ని కత్తిరించి మనిషి చెత్తను నేలకిచ్చును.

ఇరుకు గదిలో స్వేచ్ఛగా విహరించగలుగుట సాధ్యమా?
249 ఇరుకుమది గలవారు ఘనమగు కార్యములు సాధింతురా?



మంచి కట్టడి ఎప్పుడైనా కలిపి ఉంచును మనిషి మనిషిని
కట్టుబాటు తప్పినడచిన మనసు మెచ్చదు మనిషి మెచ్చడు. 250

మాటలెన్నో చెప్పి చెప్పి ఒప్పించని ఒక మనసును
ఒకే ఒక్క సూక్తి చెప్పి ఒప్పునట్లు చేయవచ్చు. 251

పుడమి పుట్టినపటినుండి మనిషి ఏమి సాధించెను?
ఘన సంస్కృతి కలిగియుండి యుద్ధములే చేయుచుండె. 252

నిండు కుండ తొణకకుండు గంభీరముగాను ఉండు
నిండుగ లేనట్టికుండ తొణకుచుండు బెణకుచుండు. 253

వద్దు వద్దు పనికిరాని కబురులెపుడు చెప్పవద్దు
పెద్ద పెద్ద పనులుచేసి వృద్ధిచేయు అదేముద్దు. 254

వ్యసనాలకు బానిసవై పనులు మాని చెడిపోకుము
కాలనియత ననుసరించి పనులుచేసి వృద్ధిపొందు. 255

గుణవంతుడె బలవంతుడు భగవంతుడు కాజాలును
గుణహీనుడు బలహీనుడు హితుడెప్పుడు కాజాలడు. 256

తొందరపడువారు ఎపుడు మంచి ఫలము పొందలేరు
నిదానముగ పనిచేసిన చిక్కులేవి పొందలేరు. 257

చేసిన పని తిరిగి తిరిగి చేసిన ఫలమేమున్నది?
ఏమున్నది ఏమున్నది పెంపు మాత్రమేమున్నది? 258



చెడు అనకు వినకు కనకు మనుచు చెప్పిన ఆ పెద్దలె
259 మంచి చూచి మంచి చేసి మంచి మాటలాడుమనిరి.

అతిసాదా జీవితమును మహాత్ముడు గడుపుచుండు
260 ఆడంబర జీవితమును సామాన్యుడు కోరుచుండు.

అనుమానము కీడుచేయు పెనుభూతము అనుచుందురు
261 నమ్మకమే మేలుచేయు పెనుసంపద అనుచుండుము.

ఆత్మస్తుతి చేసుకొనినవాని ఆత్మ ఘోషించును
262 పరులను నిందించువాడు నిందల పాలగుచుండును.

ఆశయాలు లేని బ్రతుకు బ్రతికి ఫలము ఏమున్నది?
263 దీపము వెలిగించనట్టి గృహము ఉండి ఫలమేమిటి?

కత్తిచేత చేయబడిన గాయమైన మానుచుండు
264 ఉక్తిచేత చేయబడిన గాయమెపుడు మానకుండు.

సదాచార సంపన్నుడు జాతి కీర్తి పెంచుచుండు
265 దురాచార వర్తనుండు తండ్రిపేరు త్రుంచుచుండు.

కఠినముగా మాట్లాడిన కఠిన శిలలు పగులుచుండు
266 మృదువుగాను మాటాడిన కఠిన ఎదలు కరుగుచుండు.

గట్టిమాటలు పలికినప్పుడు ఫలితమెంతయొ కలుగుచుండును
267 వట్టికూతలు కూసినప్పుడు ఫలితమేమియు పెరుగకుండును.



మోసబుద్ది నీకు వద్దు మోసగాని చెలిమి వద్దు
ఆశపెట్టి మోసగించి పరుల బాధ పెట్టవద్దు. 268

వంచించేవాడు ఎపుడో వంచన పాలగుచునుండు
ఉన్నదేదో పంచువాడు కీర్తి పొందగలుగుచుండు. 269

గాలిమేడలు కట్టబోకుము ఫలితమేమియు పొందజాలవు
గాలిగాలిగ తిరుగబోకుము తిరుగుబోతుగ పేరుపొందకు. 270

సంతృప్తి పొందు మనిషి నిజమగు సంపన్నుడందు
అత్యాశాపరుడు కదా! పరమ పరమ దరిద్రుండు. 271

చెడు తలపులు తలపెట్టిన మనిషి చెడును నిజం నిజం
మంచి తలపు కలిగియున్న మనిషి పొందు అభ్యుదయం. 272

అధికారము నిషాలాగ పనిచేసిన చెడును మనిషి
సహకారము పంచుమనిషి పదుగురి మన్ననలు పొందు 273

అంతులేని కోరికలను నియంత్రించ తలపెట్టుము
మదిని చేరు దురాశలను త్రుంచివేయ నమకట్టుము. 274

ఎవరు కూడ ఎల్లప్పుడు పరులను వంచించలేరు
వంచనపాలైనవాడు వంచగాణ్ని వంచించును. 275

కక్షను సాధించువాడు సాధించునదేముండును?
క్షమాగుణము కలవాడే మార్పును సాధించగలుగు. 276



నిజమనేది చిచ్చులాగ కాల్చివేయ జాలదెపుడు
277 సత్యం ఒక జ్యోతిలాగ వెలుగులనే పంచజాలు.

నిప్పునైన నిజమునైన శాశ్వతముగ దాచలేము
278 సత్యమునే దాచినచో నీ మదినే మండించును.

కష్టములను ఓర్చుకొనుచు పనులు నీవు చేయుచుండు
279 ఇష్టమైన ఫలితమునే ముందు ముందు పొందగలవు.

చేయతగని పనులు నీవు చేయుమనుచు చెప్పతగదు
280 చేయతగిన పనులు చేసి మేలుచేయు పరులకెపుడు.

చేసినట్టి పనుల ఫలము అనుభవించవలయు మనము
281 చెడుగు వలన చెడుగు కలుగు మంచి వలన కీర్తి పెరుగు.

ఫలములేని పలురకాల పనులు చేసి ఫలమేమిటి?
282 పట్టుదలతో ప్రగతి కొరకు పనులు చేసి ప్రగతిపొందు.

భక్తి శ్రద్ధ నీకు ఉంటె శక్తి కలిగి నీవు ఉంటె
283 అసాధ్యాలు అనుకున్నవి సాధింతువు శోధింతువు.

ఎంత ఎత్తు ఎదిగిననూ చెట్టు తూలి పడుతుందా?
284 స్థిరముగాను నిలచినపుడు పడిపోవుట ఉంటుందా?

స్థిర చిత్తము గలవాడిని కొండతోనె పోల్చుతాము
285 స్వార్థబుద్ధి లేనివాణ్ని చెట్టుతోనె పోల్చుతాము.





నీతి కలిగియున్న మనిషి నీతినెపుడు పెంచగలుగు
నీతిలేని మనిషి మంచి కీర్తినెలా పొందగలుగు? 286

త్యాగశక్తి నిరంతరం స్వార్థమునే తరిమికొట్టు
త్యాగబుద్ధి లేని మనిషి త్యాగమునే పావగొట్టు. 287

ధర్మమెపుడు నీవు ఆచరించాలని కోరుకొందు
జయము ఎపుడు నీకు కలుగుచుండాలని కోరుకొందు. 288

మితముగాను మాట్లాడిన హితము నీకు కలుగుచుండు.
అమితముగా మాట్లాడిన హాని ఏదొ జరుగుచుండు. 289

క్రోధము ఒక జ్వాలలాగా మదిని కాల్చివేయగలుగు
శాంతము విరువెన్నెలవలె హాయి నీకు కూర్చగలుగు. 290

యాచించుట ఏ మనిషికి తగదు తగదు తగదందురు
వికలాంగుల పట్ల కరుణ కలిగి ఉండవలెనందురు. 291

స్వేచ్ఛకోరు మంచి మనిషి తన బాధ్యత పాటించును
బానిసలా బ్రతుకువాడు బాధలనే పొందుచుండు. 292

సరళమతులు సౌజన్యము సాధించగ యత్నింతురు
కఠినాత్ములు చెలిమినెపుడు చెడగొట్టగ యత్నింతురు. 293

విశ్వములో శాశ్వతముగ జీవించునదేది లేదు
మార్పన్నది అనుక్షణం కలుగుచుండునది సత్యం. 294





శత్రువుతో పోరాడుట అది వీరుని లక్షణం
295 దుర్గుణములపై రణమ్ము సల్పుటయే వివేకం.

జనం మేలుకోరువాడు జనంలోనె తిరుగుచుండు
296 వెలుగునిచ్చు ఇంధనమ్ము జ్వాలలోనె మండుచుండు.

క్రియా రూపము దాల్చనట్టి మాటలన్నియు శూన్యమేకద!
297 క్రియా రూపము దాల్చినట్టి మాటలే రత్నాల మూటలు.

ఎంతస్వార్థపరుడైనా తినజాలడు బంగారం
298 ఎంత త్యాగధనుడైనా మింగలేడు అంగారం.

శాంతమనేదే మనిషికి భూషణమై భాసించును
299 అశాంతియే ప్రతిమనసును వేధించును వేధించును.

స్వార్థపరుని ఆలోచన అణుబాంబే అనిపించును
300 త్యాగమూర్తి ఆలోచన సుధాభాండమనిపించును.



